భాస్కరరావు, గురుజాడ

గురుజాడ గ్రామదేవస్థానములచరిత్రము

బెజవాడ, 1928

Record no. 779

భాస్కరరావు, గురుజాడ.
గురుజాడ గ్రామదేవస్థానములచరిత్రము / గురుజాడ భాస్కరరావుచే వ్రాయబడినది.- బెజవాడ : వాణీ ముద్రాక్షరశాల, 1928.
44 p. ;18 cm.
Record no. 779

Bhāskararāvu, Gurujāḍa.
Gurujāḍa Grāmadēvasthānamulacaritramu / Gurujāḍa Bhāskararāvucē vrāyabaḍinadi.- Bejavāḍa : Vāṇī Mudrākṣaraśāla, 1928.
44 p. ;18 cm.
Record no. 779

శ్రీ

కృష్ణాజిల్లా

# గురుజాడ గ్రామ దేవస్థానముల చరిత్రము.




గురుజాడ భాస్కరరావుచే వ్రాయబడి

ప్రచురింపబడియె.



బెజవాడ వాణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

1928.

# విజ్ఞాపనము

---

భారత కళాలక్ష్మికి కొల్వుచవికలై, భారతీయాస్తిక మహాజనుల దైవభక్తికి లోకానుగ్రహబుద్ధికి ప్రత్యక్ష నిదర్శనములై యీ కర్మభూమికి ముఖ్యాలంకారములైన మహాదేవాలయములుగాంచిన ఎవనిహృదయము పరవశముగాకుండును.

ఇస్లాముదాడికి పాదుగదలియు తాత్కాలిక దోహదక్రియలచే కొంతకొంత స్థాయినందుచున్న ఆర్యధర్మకల్పవృక్షమును పాశ్చాత్యనాగరకత ఝంఝామారుతమువలె కూకటి వ్రేళ్ళతోగూడ నల్లలాడించుచున్న యీ విపత్సమయమున సనాతనధర్మపరాయణులు స్వీయధర్మరక్షణమునకు నడుములు గట్టుకొని సిద్ధపడవలసిన యవసరమెంతయేనియు గాన్పించుచున్నది. ఒకవంక క్రైస్తవమతబోధకులు ఇంకొకవంక బ్రాహ్మసామాజికులు మఱియొకవంక పాశ్చాత్యసభ్యతామోహపాశజాలము వేఱొకవంక ఐహికసౌఖ్యపర్వతశృంగమును కరతలామలకముగావించు అధునాతన శాస్త్రపరిశోధనములును చుట్టుముట్టిన యీ తరుణమున స్వగృహరక్షణవిషయమున భారతీయులు ఇంచుకయైన ఉపేక్షవహింపరాదు.

ఈ మహాప్రయత్నమున ఆర్యధర్మమునకు మూలకందములైన మన దేవాలయములను ముందుగ రక్షించుకొనవలసియున్నది. ఒకప్పుడు మనకు పఠనమందిరములై పురాణశ్రవణ

వేదికలై కళాశాలలై మహాబోధనాలయములైన దేవాలయములు ఇటీవల మనయుపేక్షాదోషముచే కుక్షింభరులకు హస్తగతములై స్వీయమహాత్త్వమును గోల్పడి పాడువడియు కొనయూపిరితోడ నిలిచియున్నవి. దీని నుద్ధరింపగలిగితిమేని జీర్ణమగు నార్యధర్మమునకు మరల పునాదులు వేసినవారమగుదుము.

స్వీయధర్మనిలయములైన దేవాలయములను కుక్షింభరుల చేతులనుండి లాగికొనుటకు అకాలీవీరులు తమ ప్రాణములను గూడ సమర్పించుచున్న అద్భుతకథనము సర్వప్రపంచకమును విస్మయమున ముంచుచున్నది. ఆర్యజాతికంతకు అకాలీల స్వధర్మ నిష్ఠ అనుకరణీయము.

ఆంధ్రదేశమునందును 10, 15 వత్సరముల నుండియు రూపాంతరమున జరుగుచున్న యీ మహాప్రయత్నమునుగూర్చి ప్రజాసామాన్యమునందు కలిగిన విపరీతాభిప్రాయములు క్రమ క్రమముగా మార్పునొందుట కనులార గనుచున్నాము. కేవలము అర్చకజాతిపై కట్టినకత్తియని మన స్కీముదావాలను గూర్చి ప్రథమమున తలపోసినవారలే నేడు ఈ ప్రయత్నమునందలి పరమార్థమును సత్సంకల్పమును గురుతించి దానికి అభిముఖ్యమును వహించుచుండుట శుభావహము. క్రమముగా నిత్యధూప దీపనైవేద్యములకుగూడ మొగమువాచి పాడ్వడిన దేవాలయములెన్నియో ఈప్రయత్నమునకు ఫలముగా నేడు నవ్యతేజముతో నలరారుచు ప్రజాహృదయమున భక్త్యంకురముల మొలకలెత్తించుచుండుట ఆంధ్రదేశమున పలుచోట్ల కానవచ్చును. శ్రీకాకుళాంధ్రదేవుని జీర్ణాలయము పునరుద్ధరింపబడిన చిత్రచరి



త్రము కాసుల పురుషోత్తముని శతకరాజమును చదివినవారికెల్ల విదితము. ఆంధ్రదేశమున పలుచోట్ల మఱల నాచిత్రచర్యయే నేడునడుచుచున్నను దానిని మఱల చిత్రించుటకు పురుషోత్తమ కవిలేడాయెను.

ఈదేవాలయములను హస్తగతము చేసికొన్నవారు స్వార్థపరులు. వారితోపాటు ఈప్రతిష్ఠాపనములు నశించుటకు పరోక్షకారణములైన ప్రజలు తటస్థులు. ఈస్థితిలో పునరుద్ధరణ కార్యము ద్రవ్యబలము అంగబలము లేక నెరవేరదు. స్వార్థపరుల చేతజిక్కినహక్కులను బలాత్కారముగ లాగుకొనవలయునన్నను తటస్థులును ఒక్కొకచో విరోధులనుగూడ నగు ప్రజలను ఈప్రయత్నమున కభిముఖుల జేయవలయునన్నను ఎన్నికష్టనిష్ఠురములకు పాల్పడవలయునో ఎన్ని మోమాటములను సంబంధములను విడనాడవలయునో అనుభవమువలనగాని తెలియరాదు.

ఈవిచిత్రనాటకమునందలి యొకయంశమును ఈచిన్న పొత్తముమూలమున లోకమునకు వెల్లడించినచో ఆర్యధర్మ రక్షణమునకు చేయూతగానుండు ననుఉద్దేశ్యముతో ఈకథ చెప్పబడుచున్నది.

గురుజాడ,<br>5—1—28.

ఇట్లు విధేయుడు,<br>గురుజాడ భాస్కరరావు.

—

ఓం

శ్లో॥ పరంబ్రహ్మ పరంధామ పవిత్రం పరమంభవాన్।
పురుషం శాశ్వతం దివ్యమాదిదేవమజంవిభుమ్॥ గీ. ౧౦-౧౨.

## —* ప్రస్తావన *—

అవ్యక్తము, సూక్ష్మము, నగువరబ్రహ్మమే, దృశ్యమైన సర్వజగత్తునకు మూలము. సృష్టియందలి పదార్థములన్నిటికంటె విలక్షణమై, ఆద్యంతములులేనిదై, స్వాతంత్ర్యముకలదే బ్రహ్మము. దీనికెన్నడును నాశములేదు. దృశ్యస్వరూపముమాయ, సత్యస్వరూపమును కలియుటకుముందు మాయనుదాటవలయును. దానికిసద్గురు డుండవలయు. పరమాత్మయనునది యాత్మకంటె వేరగురూపము గలిగిన పదార్థముకాదు. ఇంద్రియముల జయించినపిదప మానుషశరీరమునందున్న యాత్మయే పరమాత్మయగును.

దేహము అనిత్యము. దేహికిమోక్షమును సంపాదించుటకు దేహమనునదియే ముఖ్యసాధనము. చిత్తశుద్ధికి కర్మవైరాగ్యము, భక్తి కారణములు. చిత్తశుద్ధివల్ల జ్ఞానముకలుగును. జ్ఞానమనగా స్వస్వరూపానుసంధానము. అదియే యేకాంతజ్ఞానమునకు సాధనము. అప్పుడుబ్రహ్మసత్యం, జగన్మిథ్యయనునద్వైతసిద్ధాంతములబట్టి పురుషుడు సంసారబంధములనువిడిచి పునరావృత్తిరహితబ్రహ్మైక్యానుసంధానము బడయగలడు.



పరమేశ్వరునియొక్క పూర్ణజ్ఞానము కలుగుటకు భక్తి జ్ఞానమార్గములుదక్క మూడవమార్గములేదు. రెండుమార్గములును దుదకొకదిక్కున గలియుటచే జ్ఞానికిగలుగుగతియే భక్తునకు ప్రాప్తమగును. జ్ఞానమార్గమున మొదటినుండియు బుద్ధిచే దెలిసికొనబడినయెడల, భక్తిమార్గమున శ్రద్ధచే గ్రహింపబడుటయే యీరెంటికినిగల వ్యత్యాసము.

ఏసాధనముతోనైనను నిర్గుణబ్రహ్మముతో నేకరూపము సంపాదించుకొనుటకు పాత్రత దమమనస్సునకు కలిగిననేగాని బ్రహ్మస్వరూపసాక్షాత్కారముకాదు. అవ్యక్తోపాసన (జ్ఞానమార్గము) వ్యక్తోపాసన (భక్తిమార్గము) మార్గములురెండైనను రెంటియందును నొకపరమేశ్వరుడే. నీరెండుమార్గములును ననాదిసిద్ధాంతములును, వేర్వేరైనవియునగు మోక్షమార్గసోపానములుగనున్నవి. చింతనచే మనస్సును స్థిరమొనర్చి వృత్తిని తదాకారము చేయుటయే మిక్కిలికష్టము. మనసనునది స్వభావముగనె చంచలమైనది. జ్ఞానసాధనకంటె భక్తిసాధనయెల్లరకాచరణయోగ్యము.

కాన సర్వకర్త, సర్వశక్తియుతుడు, సర్వజ్ఞుడునగు పరమేశ్వరునియందు ప్రేమస్థిరమై వృత్తితదాకారమగుటకు మనస్సునకెదురుగ ప్రత్యక్షనామరూపాత్మకమగు వస్తువుండిననేగాని సామాన్యులకు సాధ్యముకానేరదు.

ప్రతిమ పరమాత్మకాదు. ప్రతీకమునకు ప్రాణప్రతిష్ఠాపనచేయు నాచారమునందున్న రహస్యమిదియే. పరమాత్మ

భావననే యపేక్షించునుగాని ప్రతీకమును కాదు. ప్రతీక మేరూపములోనున్నను దానిద్వారా పరమేశ్వరుని భజించువారందరును మోక్షబ్రహ్మమును బొందుదురు.

భక్తిమార్గముచే జ్ఞానముకలిగి "వాసుదేవస్సర్వం" యనిమనస్సునకు దృఢనిశ్చయము కలుగును. కావున భక్తియు, జ్ఞానమును, నెవరికియుండవో వారు మునిగిపోవుట నిజము.

జ్ఞానముచేతను, భక్తిచేతను, బుద్ధిని సమముగాచేసికొని స్వధర్మానుసారముగా, నిష్కామముతో లోకసంగ్రహార్థమై పాటుబడుటయె జీవితపరమావధి.





# గురుజాడ దేవస్థానముల చరిత్రము.

కృష్ణామండలములో ప్రసిద్ధపట్టణమగు విజయవాడకు తూర్పున 10 క్రోశముల దూరమునను, మచిలీపట్టణమునకు పడమరగా 11 క్రోశముల దూరమునను, మచిలీబందరు హైదరాబాదు ట్రంకురోడ్డుమీద 21 మైలు 4 వ ఫర్లాంగునకు ఉత్తరముగా 1 ఫర్లాంగులో పుల్లేటికాల్వనంటి గురుజాడయను గ్రామముగలదు.

గచ్చగురువింద మొదలైన చిట్టడవి పుంతలచేనిండి జనసంకులముగాక యున్నను సారవంతమై వాసయోగ్యమైన పరిసరము లుండుటజేసి (హూణ) పదునేడవ శతాబ్దమున ననగా నిప్పటికి మున్నూరేడుల పైకాలమున నీప్రదేశమున గొందఱు హాలికులుచేరి గృహనిర్మాణమొనర్చి వసింపమొదలిడిరి.

ఈ గ్రామమునకు గురుజాడయను వ్యవహారనామ మేర్పడినది. ఇందుకు కారణమేమో కనుగొనుటకు దగిన యాధారములంతగాలేవు. కాని గురువుయొక్క జాడను కనుగొనిన ప్రదేశమగుటచే గురుజాడయను పేరలవడెనను జనప్రతీతి మాత్రము గలదు.

గుంటూరుజిల్లా జంపనిగ్రామమునుండి 200 సం॥ పైకాలమున కౌండిన్యసగోత్రుడును ఆపస్తంబసూత్రుడును యజుశ్శాఖీయుడునగు నాంధ్రనియోగిబ్రాహ్మణయువకు డక్కిరాజను నాత డీగ్రామమునకు జేరి స్థిరావాసమేర్పరచుకొనెను. గ్రామనామమునే గృహనామముగా స్వీకరించెను. ఈగురుజాడ వంశమునకీతడే మూలపురుషుడు. ఈయనకు ముప్వురు కుమారులు గల్గిరి. వారిలో జ్యేష్టుడగు సూరవరాజునకు 1 శరభరాజు 2 రామన్న 3 లక్ష్మన్న 4 పంతులు 5 అచ్చన్నలను నైదుగురు కుమారులు గలరు.

వీరిలో జ్యేష్టుడగు శరభరాజుగారు సన 1120 ఫసలీ ప్రాంతమున జన్మించి యెనుబది సంవత్సరములకుపైగా జీవించి ఖ్యాతి వహించెను. గుడివాడ తాలూకాలోని కమదనవారి యస్టేటున కొక తామ్రవిలిఖితమగు సనదును అప్పటి నైజాం దొరతనము వారియొద్దనుండి సంపాదించి వారికొసంగి యాకమదనవారివలన సర్వమాన్యములను పారితోషికముగా బడసెను. మరియు సన 1164 ఫసలీ ప్రాంతమున (ఆన 1754 సం॥) నూజవీటి సంస్థానమునకు దివాన్‌గానుండి తన మేధావిశేషములచే మెప్పు వడసి సర్వమాన్యములను, దివాణములో ప్రత్యేక హక్కులనుసంపాదించి యీపురుషార్థపరుడు 1206 ఫసలీలో మృతినొందెను.

వీరి సోదరులు రామన్న, లక్ష్మన్న వీరిరువురును కవలు. వీరును కమదనవారి యస్టేటునకు నూజివీటి సంస్థానమునకు నైజాం ప్రభుత్వము వారితోగల వ్యవహార నిర్వాహకులుగను వుండిరి.



లక్ష్మన్నగారి జేష్టపుత్రుడు బాలకృష్ణమ్మ, ఈయనభార్య కొకనాటి మధ్యాహ్న మావేశముగల్గి ప్రస్తుత శివాలయ ప్రదేశమున కిరుప్రక్కలనున్న శమీవృక్షముల దరిని పానువట్టముతో నున్న శివలింగమొకటి భూగర్భముననున్నదనియు నాలింగము పరశురామ ప్రతిష్ఠితమై కాలాంతరవ్యాప్తిని శిథిలమై యీప్రదేశమున నున్నది. కావున దానిని బెకలించి పూర్వప్రతిష్ఠను వెల్లడించుటకు బడమట ద్వారములో నాజమ్ములమధ్యన నాప్రదేశముననే యాలయము గట్టించి ప్రతిష్ఠాదులొనర్పవలసినదనియు జెప్పగా బరమాశ్చర్యముతో మామలగు శరభరాజు సోదరులాస్థలమును ద్రవ్వించి, యందట్లే లింగముండుటనుగాంచి యానందపరవశులై యాలయమొకదానిని తాత్కాలికముగా నిర్మించి యందాలింగమును శ్రీరామేశ్వరనామముతో ప్రతిష్ఠించిరి.

శివకేశవులనెడి భేదభావ విరహితాత్ములగు నాసోదరులు తమగ్రామమున విష్ణ్వాలయము లేకుండు లోపముదీర్ప శివాలయమున కనతిదూరమున నొక యాలయమును నిర్మించి యందు శ్రీ కోదండరామనామమున విష్ణుప్రతిష్ఠయు గావించిరి.

నిత్యనైవేద్య దీపారాధన కైంకర్యములకు నుత్సవాదులకును తమ స్వాంతభూముల నొసంగి శ్రీ జమీన్‌దారులవారిచే శిస్తు మాఫిచేయించి కట్టుబడియీనాములుగా నిచ్చియుండిరనుటకు దాఖాలాముగా నీక్రింద నుదహరించిన యంశములు బలపఱచుచున్నవి.

సన 1164 ఫసలీ ఆన 1754 సం॥న శ్రీరామేశ్వర స్వామి వారికి K.$\frac{1}{2}$ శ్రీ కోదండరామస్వామివారికి K.$\frac{1}{4}$, మెర్కభూమిని

శ్రీ వెంకటాద్రి అప్పారావుగారు దేవాదాయం యీనాములుగా గ్రాంటుచేసినట్టు ఆన 1859 సం॥న జరిగిన యీనాంకమిటీ విచారణలో డిపుట్యాటికలెక్టరు మ॥రా॥శ్రీ అమరావతి శేషయ్యావంతులుగారు రికార్డుచేస్తూ యీభూమిని దేవస్థానములకు ఖాయపరచవచ్చునని ది 2-12-1859 తేదిన శిఫార్సుచేసిరి. అందుపై యినాంకమీషనర్ టెయిలర్‌గారు ది 24-1-1860 సం॥ తేదిన ఖాయపర్చుచు శ్రీకోదండరాములపేర T. D. 220 పట్టాను, శ్రీ రామేశ్వరునిపేర T. D. 221 పట్టాను యిచ్చిరి.

N. B. (ఈ లెఖ O.S. 2-3 of 1918 బందరు సబ్ కోర్టులో, దేవస్థానముల స్కీము దావాలలో Ex. A గా దాఖల్‌కాబడెను.)

ఇందుచే స్న 1164 ఫసలీ ఆన 1754 సం॥నకు కొలది సంవత్సరములకు క్రిందటనే యీ ఆలయముల రెంటిని నిర్మించి భూముల నొసగియుండిరనుట నిర్వివాదాంశము.

శ్రీ రామేశ్వరస్వామి దేవాలయశిఖరముననున్న కలశముపై లిఖింపబడియున్న శాసనపంక్తు లీ క్రిందిసంగతులను దెలుపుచున్నవి.

"శార్వరిసంవత్సర ఫాల్గుణ శు ౧౦ శుక్రవారం॥ శ్రీగురుజాడ రామేశ్వర ఆలయముమీద శిఖరంచేయించినవారు గురుజాడ సూరపరాజుగారి కుమాళ్లు 1 శరభరాజు, రామన్న, లక్ష్మన్న, పంతులు చేయించి స్వామివారికి యీ శుభదినమందున సమర్పించినారు."

ఇందలి శార్వరిసంవత్సరము క్రీ॥ శ॥ 1781 సం॥ నకు



సరిపోవుచున్నది. ఆలయములపేర ప్రథమమున నీ యినాము లేర్పడినట్టు తెలియవచ్చుచున్న 1754 వ సం॥ నకును శిఖరముపైనున్న శాసన ప్రకారము శార్వరికి సరియైన 1781 వ సం॥నకును 27 సంవత్సరముల వ్యత్యాసము కానవచ్చుచున్నది. అనగా మధ్యకాలమున నీయాలయములు సామాన్యమైన దద్దలములుగా నుండి యనంతర మీ శార్వరిసంవత్సరమునకు (1781) శిఖర ప్రతిష్ఠనందియుండెనని తోచుచున్నది.

O.S. 2-3/1918 దేవస్థానందావాలలో Ex. 10 గా దాఖల్ కాబడిన వాటాలజాబితా లెఖవల్ల 1798 సం॥ వరకు గ్రామగుడికట్టు భూమినంతను, జమీన్దారులకును రైతులకును నాధారభూతులుగా నొప్పుచు నక్కిరాజుగారి సంతతివారు $4\frac{1}{2}$ వాటాలుగా పంచుకొని వ్యవహరించినట్లు విశదమగుచున్నది.

ఈదావాలలోనే Ex. 9 గా దాఖల్‌కాబడిన స్న 1231 ఫసలీ చెకుబంది మహాయతులెఖవల్ల $4\frac{1}{2}$ భాగములుగానొప్పు గ్రామభూములను సాగుచేయు రైతులపేర్లు, స్థలము, నెంబరు, విస్తీర్ణమును తెలుపుచు జమ్మావారిగా విడదీసికొనిన వివరములు తెలియుచున్నవి. అప్పటికే శ్రీ స్వామివారలపేరులతో విడదీయబడిన కట్టుబడి యీనాంభూములను బాలకృష్ణమ్మగారు రామప్పగారు తమవాటాజమ్మాలలో వేసికొని తమరే సాగుచేయుచుండినట్లు విశదమగుచున్నది.

సూరపరాజుగారి ద్వితీయకుమారుడు రామన్న, శరభరాజుగారి జ్యేష్టకుమారుడు వీర్రాజుగార్లు రెండుచెర్వులను

స్న 1210 ఫసలీ ప్రాంతమున త్రవ్వించిరి. అవి నేటి కీరామన్న వీర్రాజుచెర్వులని పిలువబడుచు సంతతివారిచే సంరక్షింపబడుచు మంచిస్థితియందున్నవి.

బాలకృష్ణమ్మగారు సమకాలికులలో సద్గుణవంతుడును సదాచార సంచారుడును దైవచింతాపరుండునై జీవితాంతము వరకు (అనగా 1242 ఫసలీ ఆన 1832 సం॥) మిగులశ్రద్ధాభక్తులతో స్వామికార్య నిర్వాహణ మొనర్చెను.

దేవాలయపు భూములను ఈయన స్వాధీనములోనుంచుకొని ఆదాయమునుండి యర్చకులకు నిత్యనైవేద్యదీపారాధనలకు ధనరూపముగా కొంతకాలమును భూమిని ప్రత్యేకముజేసి యొసంగి కొంతకాలమును జరుపుచు మిగతభూమిపైవచ్చు నాదాయముచే నుత్సవములు మరమ్మతులు వగయిరాకార్యములు నెరవేర్చుచుండిరి.

కాలక్రమమున బాలకృష్ణమ్మగారు పరలోకగతుడగుటం జేసి యాయన స్వాధీనములోనున్న భూములు సాగుచేయువారు లేక బంజరుగానున్న హేతువుచే నాదాయముతగ్గి నిత్యనైవేద్య దీపారాధనాది కైంకర్యములకు చాలకపోవుటచేతను క్షామబాధా వివశులయి గ్రామవాసులలోగొందరు గురుజాడవారన్యదేశముల పాలగుటయు దేవకార్యనిర్వాహణమునకు సహాయభూతులుగాన రాకుండుటయు గారణములుగా(1245 ఫసలీ ఆన 1835 సం॥ న విష్ణాలయ మంతరువుపడినట్లు Ex. 3-4 వల్ల విశదమగును.)

గురుజాడ వీర్రాజుగారి కుమారుడు శరభన్న (సంప్రతి) రామప్పగార్లును మరికొందరు గ్రామస్థులును అంతరువుపడియును



ఆలయదుస్థితిని పరికించి విషాదమునొంది స్న 1246 ఫసలీ ఆన 1836 సం॥ న దివి వేంకటాచార్యులువారిని ముస్తాబాద్గ్రామమునుండి పిల్పించి నిత్యనైవేద్యదీపారాధనాది కైంకర్యముల కాసంవత్సరమునకు గొంతధనమునొసంగి పునరుద్ధరించిరి.

దేవాలయపు యీనాములను వ్యవసాయమొనరించుకొనుచు ఫలసాయమునుండి దేవతాకార్యముల సక్రమముగాజర్పు ఒడంబడికలతో అర్చకునిచేత శ్రీ శోభనాద్రి అప్పారావుగారి పేర ముచ్చిలిక వ్రాయించి స్న 1247 ఫసలీ ఆన 1837 సం॥ న భూముల నర్చకస్వాధీన మొనర్చినట్లు Ex. 3 వల్ల విశదమగును.

ఆన 1832 సం॥ మొదలు 1878 సం॥ వరకు దేవస్థానపుటాస్తులను గురుజాడ వీర్రాజుగారికుమారుడు శరభన్న, సీతాపతిగారికుమారుడు రామచంద్రయ్యగార్ల యాజమాన్యమున నర్చకకుటుంబములవారే స్వాధీనమందుంచుకొని నిత్యనైవేద్యాదిస్వామికార్యములను శక్తికొలది నెరవేర్చుచుండిరి.

ఆన 1864 సం॥ సరియగు రక్తాక్షిసంవత్సర కార్తీక మాసమున నేతెంచిన బందరు తుపానుసందర్భమున వాయుదేవుని కాయబలముచే శివాలయశిఖరకలశము ధరణిపైబడినను తర్వాత కొలదికాలముననే యాశిఖరము గురుజాడ సీతాపతిగారి ద్వితీయకుమారుడు రామచంద్రయ్యగారిచే పునఃప్రతిష్ఠితము కావింపబడినది.

దేవస్థానములకట్టుబడి యీనాంభూము లన్నిటికినిగల కట్టుబడిశిస్తును శ్రీ జమీందార్ గారు మాఫీచేస్తూ సర్వదుంబాలా యీనాంభూములుగా నంగీకరింపబడినట్లు స్న 1278

ఫసలీ ఆన 1865 సం॥ మేనెల 5వ తేదిగల నె 96 రు హుజూర్ ఆర్డరు (Ex.5) వల్ల విశదమగును.

అభేదభావమున నర్చించు వాయుదేవు డొకకొన్నివత్సరములకుతదుపరి శివాలయ కలశముంబోలె, విష్ణ్వాలయకలశమునకుగూడ స్థానచలనము కల్పించెను. ఏకారణముననోగాని దీనిని పునఃప్రతిష్ఠిత మొనర్పక వుయ్యూరులోని జమీందార్ గారి ఠాణాకచేహారీలో జాగ్రత్తపరచిరి.

ఆదిశైవులగు నౌలూరి సుబ్బయ్యగారు శివార్చకులుగా ప్రధమమున ప్రవేశించిరి. తదాదిఆయనపుత్రుడు రామలింగము గారును పౌత్రులు సాంబయ్యసోదరులును సీ-ముదావాల పర్యవసానముదనుక నర్చనాది దేవకార్యముల నెరవేర్చుచుండిరి.

వైఖానసులగు దివి వేంకటాచార్యులుగారు విష్ణ్వర్చకులుగా పనిచేయుచున్నను, వుయ్యూరు వాస్తవ్యులు వేదాంతం తారకాచార్యులుగారుకూడ రెండవ అర్చకులుగా కారణాంతరములచే ఏర్పాటుకాబడిరి. ఈయుభయకుటుంబ పుత్రపౌత్రులు దావాలపర్యవసానము వఱ కర్చనను గావించుచువచ్చిరి.

బాలకృష్ణమ్మగారి మనుమలగు పెదశేషాచలంగారు, తమ భాగమునకు వచ్చిననివేశనస్థలములో క్షీ వంతును అర్చకకుటుంబములవారి నివాసముకొరకు నుచితముగానొసంగిరి. లిఖితరూపకములగు నాధారములులేని కారణమున దావాలసందర్భమున సాక్ష్యార్థము వీరిసంతతినికోరిరి. పూర్వులచే ప్రతిష్ఠింపబడిన దేవస్థానములకు, దమపెద్దతండ్రిగారిచే స్థలమీయబడిన విషయము తెలిసియు, పూర్వులకీర్తివిశేషములగు దానధర్మముల



నిల్వబెట్టుటకుమారుగా, కొన్నిఅనివార్యమగు కారణములచే రాజాలమనిరి. ఇట్టియుపేక్షాభావము కడుంగడు విచారణీయము గాకపోదు. దేవస్థానముల నిమిత్తమీయబడినటుల నాధారములులేనికారణమున కోర్టువా గన్యథాతలంచి ఈస్థలము లర్చకుల స్వంతమేయని తీర్మానించిరి.

గురుజాడ సీతాపతిగారి తృతీయకుమారుడు నరసింహముగారు కొందరు రయితులకడ రు 30 లు చందాగా సంపాదించి తానొక రు 30 ల నిచ్చి మొత్తం రు 60 లకు య 4-16 శెంట్లు కట్టుబడి యీనాంమెరక-భూమిని పాలావజ్ఝల నరసయ్యా వగైరాలవద్దను ఆన 1878 సం॥ 28 మార్చి తేదిన క్రయమును పొంది శ్రీరామేశ్వర, కోదండరాముల కర్పణచేసి చరితార్థులయిరి.

వీరు వుయ్యూరు ఠాణా ఠాణేదార్ గానుండి శ్రీరాజారంగయ్యప్పారావు బహద్దర్ జమీన్దార్ గారి అనుగ్రహమున ఈ య 4-16 శెంట్లు భూమికి శిస్తు మాఫీచేయించి సర్వదుంబాలా యీనాంగా మార్పించిరి.

ఆన 1878—1891సం॥వరకు ఈభూముల నమరకపరచుటయు, బాగుచేయించి, పల్లంక్రిందను మార్పించి నందలి ఫలితముచే నుత్సవములు, మరమ్మతులు జరిపించుటయేగాక, దేవస్థానములకు సంబంధించిన మిగతకార్యములయందుగూడ వీరే యాజమాన్యము వహించి నిర్వహించిరి. సమకాలికులగు గురుజాడ భానుమూర్తిగారు వీరికి సహాకారిగానుండిరి.

ఈమహాశయుడు పెద్దలయందత్యంతభక్తి, విశ్వాస గౌర

వమర్యాదలజూపు సహజస్వభావ, నిష్కామదైవభక్తిపరుడగు టచే, దన యవిభక్తజ్యేష్టసహోదరుడు రామచంద్రయ్యగారి పేరను, వంశమున పెద్దవాడుగానున్న శరభన్నగారిపేరను స్వామివార్లకుగాను ఈ య. 4. 16 శెంట్లకు క్రయ దస్తావేజును వ్రాయించిరి.

ఆదినుండియు 1892 సం॥ (1300 ఫసలీ) వరకు, గ్రామ లెఖలలోనేమి, స్వామివారి స్వంతలెఖలలోనేమి శ్రీరామేశ్వర స్వామివారని వ్యవహరింప బడుచూ వచ్చినది. గురుజాడగ్రామం తాలూకు 1301 ఫసలీ నె 12 రు జమాబంది గోష్వారా లెఖలో "రామలింగేశ్వర"స్వామి అని గురుజాడ కామేశ్వరరావు గారివలన వ్రాయబడినది. చిరకాలాచారమునకు విరుద్ధముగా వీరేల నూతననామమును వాడిరో తెలియదు. జనసామాన్యపు వాడుకప్రకారము వీరును వాడియుందురు. ఈకారణముననే స్కీముదావా ప్లయింటులోగూడ రామలింగేశ్వరస్వామియను రామేశ్వరస్వామిఅని వాడిరి.

గురుజాడ పాశ్వాపతిగారి కుమారుడు కామేశ్వరరావు, యీరామచంద్రయ్యగారి కుమారుడు సీతారామయ్యగారలు (1892—1918 సం॥ వరకు.) మానేజిమెంటు చేయుచు, కొలదియుత్సవములు కొద్దిమరమ్మతులును చేయించుచుండిరి.

పాలావఝ్జలవారియొద్ద ఖరీదుచేసిన యీనాంభూమిని గురించి కలిగిన గృహకలహము క్రమక్రమముగాబెరిగి రచ్చలకెక్కవలసిన పరిస్థితులు వివరింపవలసివచ్చినందులకు విచారమగుచున్నది.



గురుజాడ నరసింహంగారి జ్యేష్టకుమారుడు శ్రీరాములు గారు "తమతండ్రిగారిచే నేర్పరుపబడిన యీనాంభూమిపై వచ్చుచున్న యాదాయము వ్యయము జెప్పవలసినదిగను తమపేరు గూడ లెఖలలో చేర్పించవలసినదిగను"

"మా తండ్రిగారిపేర క్రయంకాబడినదిగనుక మీా పేరు లెఖలలోచేర్చుటకుగాని లెఖచెప్పుటకుగాని కోరదగినవిషయము గాదని" సీతారామయ్యగారును,

సోదరులకుమాళ్ళిరువురును వివాదలుపడు సందర్భమున గ్రామవాసులగు గురుజాడ ఆదినారాయణ,నౌలూరురామలింగం, చల్లా శేషాచలం, బుర్రాసుబ్బయ్య మొదలగువారు.

"కామేశ్వరరావు, సీతారామయ్యగారలపేర్లు లెఖలలో చేర్పించగూడదనియు, క్రయధనములో సగముసొమ్ము నరసింహంగారిచ్చినందున వారికుమాళ్లపేరు లెఖలలో చేర్పించవలసినదనియు." యిద్దేప్రార్థనను బలపరచుచు శ్రీరాములుగారును ది 1-11-1898, ది 6-12-1898 సం॥ తేదీలను కృష్ణాహెడ్డు అసిస్టెంటు కలక్టరుపేర అర్జీలుపంపిరి.

రివిన్యూ విచారణానంతరమున "క్రయదారుల కుమారులపేర్లు లెఖలలో నమోదుకాబడినవి. అర్జీదారుకు హక్కుఉన్న యెడల సివిల్‌కోర్టు ద్వారా స్థిరపర్చుకొనవలసినది. గా Dis. 147/gl. ది 10-7-1899 సం॥ గన్నవరం తహసిలుదారుగారొక దీర్ఘమైన యిండార్సుమెంటును శ్రీరాములుగారికి పంపియుండిరి.

అవిభక్తకుటుంబద్రవ్యముచే నార్జించిన దేవాదాయమునకు తమసోదరునకు లెఖచెప్పకుండుటగాని, తమకంటె పెద్ద

లగువారి పేర లెఖలలో పేరుండుట తప్పుగాతలచుటగాని, సమంజసహేతువాదములు కానేరవు. ఇంతటితో నీవివాదలు తాత్కాలికముగ నంతరించినవి.

సాలు 1 కి ఖ 40 కు పైగా ఆదారాగల య 48-84 శెంట్లు॥ సర్వదుంబాలాయీనాం వల్లంభూమి యర్చకుల స్వాధీనములోయుండినను వివాహాదికార్యములకు తెచ్చిన అప్పుల తీర్మానమునకుగాను య. 38 లను, బొకుబందాదీర్ఘకవుళ్ళుమూలమున ఋణదాతలకు 30 సంవత్సరములవరకు స్వాధీనపరచి తమ జీవనాధారమునకైనను తెరవులేకుండ చేసికొనిరి.

అందుచే నౌలూరు వీరభద్రయ్యగారు తిండికిలేక భిక్షాటనముతో గొంతకాలము గడపి దుర్భరజీవితము నేవిధమునను గడుపజాలక ఋణదాతలకు నివేశనమునుకట్టి స్వామియర్చనను విడచి విదేశగతుడయ్యెను. ఆదా రాకయున్నను నౌలూరు సాంబయ్యసోదరు లేవిధమునన్నో, కుటుంబయాత్ర గడుపుచు కష్టములకోర్చి యోర్చి స్వామిఅర్చనాదుల నెరవేర్చిరి.

విష్ణ్వార్చకులు తాడంకి, వుయ్యూరు, కాటూరు, శని. వారపుపేటలలో నివాసమొనరింపుచు దమతనువంతుల యర్చనను మాత్రముచేసి వెళ్లుచుండిరి. వేదాంతం తారకాచార్యులుగారి కుమార్డు చినవెంకటాచార్యులుగారు దేవస్థానపు భూములను బొకుబందాలకిచ్చి ఆదాలేక, అమితకష్టములతో జీవయాత్ర గడుపుచుండెను.

విష్ణ్వార్చకులొక్కరైనను నీగ్రామములో కాపురము



లేనిహేతువుచే స్వామివారి నివేదన కప్పుటప్పుటికి భంగముకలుటయుగూడ తటస్థించుచుండెను.

విష్ణుగర్భాలయమును ఆంజనేయదద్దళమును, ధ్వజదండమును శిధిలములై ప్రధానశిఖరకలశమును, ప్రాకారమును లేకుండెను. శివాలయమునకు ధ్వజదండము నామకః ఉండి వున్నను, ప్రాకారము లేకుండెను.

గ్రామవాసులలో పలువురీ బొకుబందాకవుళ్ళకు పాల్పడి పరమార్థచింతను మఱచి స్వలాభమునే ఎక్కువగా గణనచేయుచుండిరి. కాని దుస్థితినిజూచి వగచువారు లేకపోలేదు.

ఇట్లెన్నియో వర్షములు గడచుచుండగా, దైవవశమున రివిన్యూఅధికారులు పురస్కరించుకొని "విష్ణుగర్భాలయము శిధిలమై ప్రమాదకరముగా నున్నదని, రక్షణకొరకు నూడతీయుటగాని, లేదా ఆలయమునే మూసివేయుటగాని జరిగించవలె"నని వత్తిడిచేసిరి. స్థానికమానేజిమెంటుచేయు కామేశ్వరరావు సీతారామయ్యగార్లు యీతరుణమున ఆలయము నూడదీసి కట్టించుటకు పూనుకొనిరి. "ఆలయమును తిర్గి కట్టించెదమని తగురీతిని హామియిచ్చినగాని, జోక్యము కలుగజేసుకొన వీలులే"దని దివి శ్రీరామాచార్యులు మొదలగువారు అభ్యంతర పరచుటచే నిరుత్సాహులై అవసరమగుచర్యజరిగించక యుపేక్షించవలసి వచ్చెను. అర్చకనిరంకుశత్వమున కిదియొక తార్కాణముకాకపోదు.

రివిన్యూ వుత్తర్వుల గమనించక యుపేక్షించినందున "దేవస్థానం యీనాం భూములను రిస్యూంచేసి శేరి పట్టానొస

గుటకు ప్రపోజల్సు పంపగలందులకుగాను T. D 200 రు బి. రిజిష్టరు సహితముగా గన్నవరమునకు హాజరుకావలె'' నని గ్రామ కరణం, మునసబుగార్లకును, అర్చకులకును Rc. 296/Gl. of 14 నెం॥ తహస్సిలుదార్ గారు నోటీసులనంపిరి.

ఇట్లుండ, తమ పూర్వులచే ప్రతిష్టింపబడిన దేవస్థానముకు విపద్దశసంప్రాప్తమయి విచ్ఛన్నమగు దుర్దినములు రాగా ఆసంతతి వారమని చెప్పుకొనుచు మిన్నకుండుట పురుషధర్మము కాదని ఎంచి నిష్కామచింతతో, కష్ట నష్టముల లెక్కించక ఫలాఫలములను గుణించక అసమర్థతను తలపోయక స్వామి కార్యమును శక్తికొలది సాధింప కృతనిశ్చయులై అవాఙ్మనసగోచరుడును లీలా విగ్రహస్వరూపుడగు నా కోదండరాముని అండగానమ్మి గురుజాడ నరసింహంగారి ద్వితీయ తృతీయ కుమారులు రామచంద్రయ్య భాస్కరరావుగారు లీ సందిగ్ధసమయమున పూర్ణోత్సాహముతో గార్యరంగమున ప్రవేశించిరి.

“దేవస్థానమునకు పుయ్యూరు రాజాగారును కామేశ్వర రావు సీతారామయ్యగార్లు ట్రస్టీలనియు వారలు కట్టించుటకు పూనుకొననియెడల ప్రతిష్టాపకుల సంతతివారమగు మేమే నెరవేర్తుముగాన భూములను రిస్యూం చేయకూడద''ని గన్నవరం తహస్సీలుదారునకును.

“ఆలయమును నిలవబెట్టుటలో మీకును బాధ్యతగలదు గనుక ఆలయం కట్టించవలసినదని అట్లు జరుపనియెడల సివిల్ ప్రొ॥ కోడ్డు న 98 రు శెక్షన్ ప్రకారము స్కీము దావాలు తెచ్చుటకు మాకు ఆమోదమును యిస్తూ అవుసరమగు సహా



యమును చేయవలసినదిగా శ్రీ రాజా వెంకటాద్రి అప్పారావు బహద్దర్ జమీందారుగారికిని ది 17—12—1915 సం॥ తేదీన అర్జీలు పంపిరి.

అందుపై జమీందారుగారు అర్చకులను పిలువనంపి ప్రస్తావించి పరిస్థితులు క్లిష్టముగా నున్నవని తెలిసికొని ఒక సంవత్సరమువరకు రిస్యూంచేయక నిల్పియుంచవలసినదిగా కృష్ణా డిస్ట్రిక్టు కలక్టరుగారిని కోరినారు. రాజాగారి కోరికను కలెక్టరు గారు అంగీకరించినారని Rc. 243/ Gl. of 1916 (నెంబరున) గన్నవరం తహస్సీలుదారుగారు రామచంద్రయ్య సోదరులకు తెల్పెను.

అర్చకుల స్వాధీనమునుండి దేవస్థానం భూములను తొలగించుటకు రాజాగారే దావాదాఖల్ చేయనెంచి బోకు బందా కవుల్లు మొదలగు అవుసర రికార్డును జాగ్రత్తపరచి న్యాయవాదుల సలహాకు పంపగా వాదిగానుండుటకు వీలులేదని తెల్పుటచేతను కోరినగడువులోపల యేమి చేయుటకును సావకాశము చిక్కనందునను “మీ దేవాలయములను గురించి స్కీము దావాలు తెచ్చుటకు అంగీకరించుచున్నామని'' హుజూర్ ఆఫీసు Rc. 696/Gl. of 17 (ది6-1-1917) పుయ్యూరు రాజాగారు రామచంద్రయ్య సోదరులకు తెలిపిరి. దావాల నిమిత్తం వారు జాగ్రత్తపరచిన దస్తావేజులను కూడ యిప్పించిరి.

ఇదిమొదలు అర్చకులను గ్రామంలోని పెద్దలను బోకు బందా ఋణదాతలను పెక్కుమారులు సమావేశపరిచి రచ్చలకెక్కకనే ఆలయములుబాగగుటకు కర్తవ్యమును నిర్ణయింపకోరి

సర్వశక్తుల ప్రయత్నించి ఆన 1917 సం॥ డిశంబరువరకు వేచినను ప్రయోజనము గానమిచే స్కీముదావాలు వేయుట తప్పనిసరి యైనవి.

అందుపై "ఆలయములకు గల స్థిరచర రూపమగుయావదాస్తిని దేవస్థానపు ఆస్తిగా స్థిరపరచి అందుల మానేజిమెంటున కొకట్రస్టిని నియమించి స్కీము నేర్పరచి ప్రతివాదులవల్ల జమాఖర్చులు చెప్పించి ఆస్తులను ట్రస్టి స్వాధీనపరచి దేవళములను మంచి స్థితిలో నుంచకోరి" మచిలీపట్టణ టెంపొరరి సబ్ కోర్టునకు ప్లయింటు వ్రాయించబడెను.

ఈ దావాలలో గురుజాడ నరసింహాం గారి కుమారులు రామచంద్రయ్య, భాస్కరరావులును గురుజాడ నాగభూషణం గారి జ్యేష్టకుమారుడు వెంకటేశ్వరరావుగారును వాదులుగా నుండిరి.

నౌలూరు సాంబయ్య సోదరులును దివి శ్రీరామాచార్యులు మొదలగువారును వేదాంతం పెదవెంకటాచార్యులు వగైరాగార్లు అర్చక ప్రతివాదులుగను.

శ్రీ రాజా వెంకటాద్రి అప్పారావు బహద్దర్ జమీన్‌దార్ గారును, గురుజాడ శీతారామయ్య, కామేశ్వరరావుగారలు ట్రస్టి ప్రతివాదులుగను చేర్చబడిరి.

ఈదావాలను దాఖల్‌చేయుటకు పర్మిషన్ యిప్పించ కోరి మద్రాసుప్రభుత్వ అడ్వొకేటు జనరల్‌గారి కోర్టులో ది 14--12--17 తేదీన శ్రీయుత వల్లూరి కృష్ణమోహన్



రావుగారి ద్వారా పిటీషన్ దాఖల్ చేయించి పర్మిషన్ పొందబడెను.

పాలావఝ్ఝలవారియొద్ద ఖరీదుచేసిన యీనాం భూమి యంతయు పల్లంక్రింద మారి వత్సరాదాయము పెరిగినది. ఆన 1916 సం॥ వరకు సాలియానాఖర్చుపెట్టగా మిగులుచు కామేశ్వరరావు, సీతారామయ్యగార్లవద్ద నిల్వయున్న మొత్తమునుండి రు 1406-14-6 వ్యయపరచి విష్ణ్వాలయ గర్భాలయమును, నాలయముల ప్రాకారమును, ప్రాకార సింహద్వారముల రెంటిని 1917-18 లలో (దావామధ్యకాలమున) పూర్తిచేసిరి.

దేవాదాయధర్మాదాయ పునరుద్ధరణమునకై కంకణధారియై, వాదులతోపాటు దూషణ భూషణ తిరస్కారములకు లోనై మతప్రతిష్టావనల నుద్ధరించుట కారణముగా జన్మించెనోయన స్కీముదావాలలో వాదులపక్షమున పనిచేయుటకు ప్రతిజ్ఞబట్టిన విఖ్యాత న్యాయవాదియగు శ్రీయుత వల్లూరి సూర్యనారాయణరావుపంతులుగారివలన ది 2-1-1918 సం॥ తేదీన బందరు టెంపొరరి సబ్ కోర్టులో దావాలు దాఖల్ చేయించబడెను.

శ్రీ కోదండ రామస్వామివారి దేవస్థానమునకు సంబంధించినదావా O. S. 2 of 1918 గాను, శ్రీరామేశ్వరస్వామివారి దేవస్థానమునకు సంబంధించినదావా O. S. 3 of 1918గాను నెంబర్లుపడెను.

శివాలయపుటాస్తులు హెచ్చుగా అన్యాక్రాంతములైన పరిస్థితులు క్లిష్టముగానుండి, మానేజిమెంటు దుస్థితిలో నుండుటచే, విష్ణ్వాలయముతోపాటు ఏకకాలమునదావా చేయబడెను.

యీనాం రిస్యూంకు సంబంధించిన కార్యక్రమ మింతటితో నిలిచిపోయెను.

"ఆలయ ఆస్తులను యస్టేటువారేమిన్ని మానేజిచేయుట లేదు. భూములు అర్చకస్వాధీనములో నున్నవి. అన్యాక్రాంతములైనట్టు మాకును తెలియవచ్చినది. కళ్యాణములకు సా॥ 1కి రు 30 లు యిచ్చుచున్నాము. స్కీము అగుటకు ఆక్షేపణ లేదు" అని శ్రీరాజాగారును,

"మిగతభూములపై మాకు సంబంధము లేదు. మాతండ్రులేర్పరచిన య 4-16 శెంట్లభూమిపై వచ్చెడి ఆదాయమును స్లు1300 ఫసలీ అంతము వరకు, 1, 3 వాదుల తండ్రి నరసింహం గారు మానేజిచేసినారు. అది మొదలు మేము మానేజిమెంటు చేయుచున్నాము. పూర్వమునుంచి వున్న ఆచారప్రకారము వంశ పారంపర్యా గోత్రనామములు మాపేరజరిగించే యేర్పాటుతో ట్రస్టిని ఏర్పరచుటకు ఆక్షేపణలేదు. మమ్ములను తొలగించకూడదు. రు 173-8-11 లు జాస్తిగా ఖర్చుపెట్టినాము. అదిభర్తీకావలెను. అందుల లెఖ యిందుతో దాఖల్‌చేసినాము. మాది ప్రత్యేకట్రస్టుగాని జనరల్ ట్రస్టుకాదు." అని కామేశ్వరరావు, సీతారామయ్యగారులును,

"ఆలయములకు వాదుల కుటుంబములోని పూర్వీకులచే నిత్యనైవేద్య దీపారాధనలకు భూములివ్వబడినవి. మరమ్మతులు నుత్సవములు భక్తులగు గ్రామవాసులుగాని, జమీన్‌దారుగాని, చేయించవలెను. భూములందు వ్యతిరేకభుక్తము, మేలువరం, కుడివరం హక్కులు మాకుగలవు. గనుక మమ్ములను తొలగింప



కూడదు. భూములను బలపర్చినాము. జమాఖర్చు చెప్పనగత్యములేదు. జమీన్‌దారుగారును, కామేశ్వరరావు, సీతారామయ్యగార్లును ట్రస్టులైవున్నారు," అనిఅర్చక ప్రతివాదులును,

స్టేటుమెంట్లు దాఖల్ చేయగా "ఆలయభూములు నిత్యనైవేద్య దీపారాధనలకు ప్రత్యేకింపబడినవా? లేక జనరల్ యండవుమెంటా? మేలువరం కుడివరంహక్కులు అర్చకులకుకలిగెనా? అర్చకరీత్యా స్వాధీనములోనున్న భూముల యందు వ్యతిరేక భుక్తముకలిగెనా? అర్చక ప్రతివాదులను భూములనుండి తొలగించినయెడల ఫలపర్చినందుకు కంపెన్‌శేషన్ యివ్వవలెనా? ప్రతివాదులలో ఎవరినిగాని మేనేజిమెంటులో, దగా, హారింపు, మొదలగు కారణములతో ట్రస్టిషిప్పునుండి ఏల తొలగింపకూడదు? ఏప్రతివాదులవల్లనైనను జమా ఖర్చులు పుచ్చుకోవలెనా? మొదలగు సారాంశము లేర్పడెను.

వాదులు కోదండరామునిపై భారమిడి తమ పక్షమున సాక్షులను వేసికొనక, దస్తావేజులను మాత్రము దాఖల్‌చేసి విచారణను ముగించిరి.

రాజాగారి పక్షమున మ॥ రా॥ శ్రీ శెడింబి హనుమంతరావుపంతులు బి. ఏ., బి. యల్., గారును, మిగతా ప్రతివాదులతరపున మ॥ రా॥ శ్రీ యడవల్లి దక్షిణామూర్తిశాస్త్రి బి. ఏ., బి. యల్., గారును పనిచేసిరి.

ప్రతివాదుల పక్షమున గురుజాడ కామేశ్వరరావు, చల్లా శేషాచలం, వేదాంతం పెదవెంకటాచార్యులు, నౌలూరి సాంబయ్య వగైరాగారులు సాక్షులుగా విచారింపబడిరి. తరతరముల

నుండియు ప్రాణప్రదముగా కాపాడబడుచు కామేశ్వరరావుగారివద్దనున్న పురాతన గ్రామలెఖలెన్నియో యీదావాలసందర్భమున పెకలింపబడి ప్రతివాదుల తరఫున దాఖల్ కాబడి కామేశ్వరరావుగారిచే సమర్థింపబడెను. ఈపురాతనలెఖలు బయల్పడుటచే మహోపకారమగునని నమ్మిన అర్చకప్రతివాదులకు ఆశాభంగముగలిగెను. ఏలయన వాదుల కనుకూలముగా తీర్పిచ్చుటకు న్యాయమూర్తులకీ లెక్కలెంతయో తోడయ్యెను.

న్యాయాధిపతి శ్రీమాన్ కృష్ణమాచార్యులుగారు, ధర్మనిర్ణయమున కెన్నియో దినములకొలది విచారణజరిపి,

"అర్చకులు వాసముచేయుచున్న నివేశనములు దేవస్థానములవేయని రుజువు లేదనియు, ప్లయింటు పెడ్యూలు దాఖలామిగత స్థిరచరాస్తులన్నియు ఆలయములకే సంపూర్ణ హక్కుగలవనియు, మేలువరం కుడివరం హక్కులుగాని, వ్యతిరేకభుక్తముగాని అర్చక ప్రతివాదులకు కలుగలేదనియు, కంపెన్సేషన్ యివ్వనగత్యములేదనియు, య 4-16 శెంట్లు ప్రత్యేక ట్రస్టుకాదనియు, భూములనుండి అర్చకులను, మానేజిమెంటునుండి ప్రతివాదుల నందరిని తొలగించినామనియు, దేవస్థానముల స్థిరచరాస్తులను స్వాధీనపర్చుకొని తాత్కాలికముగ మానేజిమెంటు చేయుటకు ఒకరిసీవరును, 1301ఫసలీలగాయతు కామేశ్వరరావు, సీతారామయ్యగార్ల మానేజిమెంటుకు సంబంధించిన జమాఖర్చు లెఖలు తేల్చుటకు ఒక కమీషనర్‌ను అప్పాయింటు చేయుటకును ఒకస్కీము నేర్పాటుచేయుటకును తీర్మానించుచు"ది15-11-1918 సం॥ ప్రిలిమినరి డిక్రినిచ్చిరి.



అర్చక ప్రతివాదులలో కొందరికి ప్రత్యేక ఆస్తిగాని, ఆర్థిక స్తితిగాని బాగుగలేవనియు, జమాఖర్చు లెఖలు తేల్పించనగత్యములేదనియు, విచారణ మధ్యకాలమున వాదులు కోర్టువారికి మనవిచేయుటచే కోర్టువారును సమ్మతించిరి.

కమీషనర్‌గా అప్పాయింటు కాబడిన మ॥రా॥శ్రీ మరంగంటి పార్థసారథి బి. ఏ., బియల్‌గారు 1301 ఫసలీలగాయతు లెఖలన్నిటిని పూర్తిగా పరిశీలించుటయేగాక పలువురు సాక్షులను విచారించి రికార్డుచేసి, వుభయవాదనలను శాంతముగా విని కామేశ్వరరావు, సీతారామయ్యగారలవలన రు 743-14-3 దేవస్థానముల ట్రస్టుకు రావలసియున్నదని దీర్ఘమగు రిపోర్టును వ్రాసిరి.

కోర్టువారు రెపోర్టును చిత్తగించి వాదప్రతివాదములను విని కమీషనర్‌గారి రిపోర్టును స్థిరపరచి రు 743-14-3 లు కామేశ్వరరావు,సీతారామయ్యగార్లు చెల్లించునట్లుగా, ది 28-3-1919 సం॥ ఫైనల్ డిక్రినిచ్చిరి.

O.S. 3 of 1918 దావాలో అర్చక ప్రతివాదులగు నౌలూరు సాంబయ్యసోదరులు, బందరు సబ్‌కోర్టువారి ప్రిలిమినరి డిక్రిపై మద్రాసు ఉన్నత న్యాయస్థానమువారికి ది 15-3-1919 మ॥ రా॥ శ్రీ అల్లాడి కృష్ణస్వామయ్య బి. ఎ., బి. యల్ గారి ద్వారా అప్పీలుదాఖల్ చేయించిరి. O.S. 2-3 of 1918 దావాలలోని మిగత ప్రతివాదులందరును హైకోర్టునకు అప్పీలు చేయుట మానిరి.

మ॥రా॥శ్రీ యడవల్లి శివరామలక్ష్మీనరసింహాం బి. ఎ., బియల్‌గారు రిసీవరుగా అప్పాయింటు కాబడి దేవస్థానముల స్థిర చరాస్తులన్నిటిని ది 17-5-1919 సం॥ వప్పగింతచేసుకొని స్న 1329 ఫసలీకి భూములను సాగుచేయు నిమిత్తము వేలంపాట మీాద అమరకపరచి ముచ్చిలికాలు వ్రాయించిరి.

బోకుబందాలరీత్యా చాలవత్సరముల పర్యంతము తామనుభవించుటకు హక్కుగలదనెడి వాదనను పరమార్థచింతతో వదలుకొని గురుజాడ సాళ్వావతిరావు, నర్రా అంకినీడు, యీా వెంకటకృష్ణయ్యా మొదలగు కౌలుదార్లందరు తమ స్వాధీనములోని భూములను ఉదారబుద్ధితో రిసీవరుగారికి వప్పగింతచేసిరి.

వాదుల ప్రార్థనపై రిసీవరుగా ఏర్పడిన లక్ష్మీనరసింహాం గారే ది 25-8-1919 సం॥ మొదలు మూడు సంవత్సరములవరకు ట్రస్టీగా కోర్టువారివలన అప్పాయింటు కాబడి ది 23-10-1919 సం॥ నుంచి ట్రస్టీగా వ్యవహరించిరి.

“గురుజాడ, బందరు వాస్తవ్యులలో మేజరులుగానుండి, రు 2000 లకు పైగా నికరాస్థిగలిగి, బుద్ధిస్వాస్థ్యముగల ఏహిందువైనను, గ్రామప్రజలచే ఎన్నికోబడి కోర్టువారిచే ఆమోదింపబడువారు మూడుసంవత్సరములవరకు ట్రస్టీగా (గౌరవోద్యోగి) దేవస్థానపు ఆస్తులను కాపాడుచు మానేజిమెంటు చేయుచుందురు. అన్యాక్రాంతములొనర్చుటకుగాని ఋణములు తీయుటకుగాని కోర్టువారి శాంక్షణపొందవలెను. ట్రస్టీ వరిపాలనకు సంబంధించిన సాలుసరి జమాఖర్చు స్టేటుమెంటును ప్రతితెలుగు



సంవత్సరాది పండుగరోజునను దేవస్థానముల (నోటీసు బోరునకు) అంటించి ప్రకటించవలెను.

ప్రతిసంవత్సరము చైత్ర శు ౧౫ లోగా, ఆసంవత్సరము తాలూకు, అంచనా ఆయవ్యయబడ్జెటును కోర్టువారివిశదమునకు పంపవలెను. దేవస్థానములందభిమానముగలవారెవరైనను ముందుగాతెల్పి లెఖలుచూచుకొనుటకును ట్రస్టీ అక్రమపరిపాలనను గురించి కోర్టువారికి పిటీషను పెట్టి తొలగించుటకును అధికారము గలదు”

ఇట్టి పౌరస్వాతంత్ర్య సూత్రములతో విశాలదృష్టిని స్కీము నియమము లేర్పరచబడెను. ఇందుచే నిరంకుశ వర్తనముతో ట్రస్టీదేవాలయముల కెట్టిహాని యొనర్చుటకును స్వాతంత్ర్యత లేదు.

శివార్చకులొనర్చిన హైకోర్టు అప్పీలు A.s. 134 of 19 దావా ఛీఫుజస్టీసువాలీసు, జస్టీసు శేషగిరిఅయ్యరుగార్ల ఎదుట ది 20-7-20 సం॥ విచారణకు రాబడినది. అప్పీలువాదుల పక్షమున మ॥ రా॥ శ్రీ అల్లాడి కృష్ణస్వామయ్యా బి. యె., బి. యల్. గారును రెస్పాండెంట్లు తరఫున శ్రీయుత ఆవరబుల్ వేమవరపు రామదాసుపంతులు బి. యె., బి. యల్ గారును గావించినవాదనలను విని క్రిందికోర్టువారి డిక్రీఖాయపరచి ఖర్చులతో అప్పీలును వ్రాసివేస్తూ రెస్పాండెంట్లకు ఖర్చులు ముజరాలు యిప్పించిరి.

రామచంద్రయ్యా సోదరులు ది17-12-1915 తేదిన సంకల్పించిన రామకార్యము, మహాసముద్రముమధ్యమున ప్రచండమగు తుపానుకుగురియైన నావ చందమున అవాంతరములు

గడచి, దైవబలముచే ది 20-7-20 తేది మధ్యాహ్నము 3 గంటలకు మద్రాసునగరమున గట్టెక్కినది. వారి జీవితమున నీ దినము శుభదినమనుట అతిశయోక్తి కానేరదు.

ఈ స్వామికార్యములను నెరవేర్చుటకు పూనుకొనుటలో స్వలాభము లేదని లోకమెరిగినను, పర్మిషన్ పుచ్చుకొనినదాది అప్పీలు పర్యవసానమగువరకు జరిగిన మూడుసంవత్సరములలోపల ఎందరు మిత్రులకు, పెద్దలకు, ఆత్మబంధువులకు, నిర్హేతుకముగా ఎన్నివిధముల కంటకులైరో, రెండుకోర్టులవ్యవహారనిర్వహణమునకెంతద్రవ్యము వెచ్చించిరో ఎన్నికడగండ్లపాలైరో కష్టములు గట్టెక్కి కార్యభారమెన్నడు తీరునాయని ఎంతపరితాపపడిరో సర్వశక్తులగు రామేశ్వర, కోదండరాములకును, వీరిపాదారవిందముల నమ్మి పనిచేసిన రామచంద్ర, భాస్కరసోదరులకు మాత్రమే విదితము.

గురుజాడవారివంశమున కాటపట్టగు గురుజాడగ్రామములో తమ పూర్వులచే ప్రతిష్టింపబడిన దేవళములు, దేవాదాయపు వసతులు తత్సంతతివారు బ్రదికియుండగనే మాసిపోయినవనెడి దుష్కీర్తికి పాల్పడజాలక ఎన్నియో కష్టములను గడచి తుదకు గట్టెక్కి స్తిమితమనస్కులై నూతనయుగోదయమగుటచే అమందానంద కందళిత హృదయారవిందులైన యీసోదరులు పరమేశ్వరప్రీత్యర్థము పూర్వులకీర్తి చిహ్నములగు దానధర్మముల నిలబెట్టుట తమకు విధ్యుక్తధర్మముగా నెంచి కావలెనని కోరి తాము లోనైన కడగండ్లనుగూర్చి లోకమునకు తెలుపక పోవచ్చును. గాని వారి సచ్చింతనమును లోకము గురుతింపకపోదు.



మ. రా. శ్రీ. యడవల్లి శివరామ లక్ష్మీనరసింహం గారు ట్రస్టీ కార్యభారమువహించి నప్పటికి శిథిలములై పడుటకు సిద్ధముగానున్న రెండుఆలయముల ధ్వజదండములను చాలకాలముక్రిందటనే పడిపోయిన విష్ణ్వాలయ శిఖర కలశమును కొరతలుగా నుండుటచే నీప్రతిష్ఠలు ప్రప్రథమమున నెరవేర్పవలసిన విధిగానుండెను. రౌద్రినామసంవత్సర మాఘ బ 3 శుక్రవారమున ప్రతిష్టలుచేయ సంకల్పించి ధ్వజోన్మీలనముకు ముందు గావించవలసిన కళావాహనము చేయుటకు బ్రహ్మగా నుండిన ఆరాధ్యులవారు యాజ్ఞీక మొనర్చుటకు తాను కూర్చునుటకు పీటవేయవలసినదిగా కోరిరి. పూర్వమునుంచి యున్న యీనాములు తమ స్వాధీనములో నుంచి పోయినట్టే పీటవేయు పూర్వాచారముకూడా పోయినది గాపున పీటవేయనని నౌలూరుసాంబయ్య నిరాకరించెను ఈసందర్భమున పెద్దలగు గురుజాడ కామేశ్వరరావుగా రరుదెంచి, పీటవేయుట అనాచారము కానేరదనియు మామూలు ప్రకారము పనులు నెరవేర్చుట విధియనియు సెలవిచ్చినను సాంబయ్య తనవిధి నెరవేర్పడయ్యెను.

మరుదినమున నౌలూరు సాంబయ్య తన అర్చకత్వపు నౌకరికి రాజీనామావ్రాయించి అందు "స్వామివారికి డబ్బు పుచ్చుకొని నౌకరి చేయుట శాస్త్రవిరుద్ధమని, పద్దిల ప్రకారం అశాస్త్రీయమైన పనిచేయుట యుక్తమగు పనికాదని యెంచి

యీ దేవస్థానం నౌకరి నా మనఃపూర్వకముగా వదలుకోవటమైనది.'' అని యుదహరించి ది 15—2—21 తేదీన ట్రస్టి గారి కందచేసెను.

అందు పై ట్రస్టిగారు ది 18—2—21 తేదిన గ్రామములోని పెద్దలను సాంబయ్యసోదరులను పిలిపించి నౌకరీని మానవద్దను రాజీనామాను ఉపసంహరించుకోవలసినదని వారం రోజులలో జరుగనున్న ప్రతిష్ఠాంతమువరకైనను పనులు నెరవేర్చ వలసినదని కోరిరి.

వాదులగు గురుజాడ రామచంద్రయ్యగారును, మధ్యవర్తులగు పోలాశి కోటయ్య, నర్రా వెంకటకృష్ణయ్యగారును మానివేయవద్దని ఎన్నియో విధముల బుజ్జగించిరి. కాని ఎవరి సలహాలను పాటించక మానివేయుటకు కృతనిశ్చయుడనైతినని తెల్పి, తమ స్వాధీనమందున్న కుంచకోలను ట్రస్టిగారికి వప్పగించెను.

తాతతండ్రులనాటినుండి యర్చనాదికము లొనర్చుచు వచ్చిన యీ కుటుంబమువారు తమ హక్కులకొరకు ఉన్నతన్యాయస్థానమువరకు పోరాడుట తప్పుకానేరదు. స్వార్థసిద్ధికై యీ కార్యకలాపములో చూపిన యోపిక,పట్టుదల ఆక్షేపణార్థము కాదుగాని, ట్రస్టి ఏర్పడిన దర్మిలాను రొఖరూపమున నెల 1కి రు 30/చొ॥ వరుమానముతో కొంతకాలము పనిచేసి సుఖోపాయముగా కుటుంబ పోషణజరుగ గలదని తెలిసికొనిగూడ అనాలోచితముగా రాజీనామాను దాఖల్ చేయుట విచారకరము.



ఆదిశైవులగు సాంఘికులెవ్వరును తమ స్థానము నాక్రమింపకుండ కట్టడిఏర్పరచుకొని కొలది రోజులలో జరుగనున్న ప్రతిష్ఠాదికార్యములకు విఘ్నములు కల్పించవచ్చుననెడి తలంపున గూడ ఇంత సాహసముకు దిగియుందురు.

మరుదినమున యర్చనాదికములను పెద్దలగు గురుజాడ కామేశ్వరరావు, యీ రామచంద్రయ్యగారలు నెరవేర్చి మార్గదర్శకులైరి. వీరి మార్గముననే గురుజాడ ఆదినారాయణగారి కుమారుడు సాళ్వాపతిరావుగారు ప్రతిష్ఠాసమయమున కంకణధారియై దురభిమాన రహితుడై ప్రత్యర్థులహేళనలను పాటింపక శ్రద్ధాభక్తులతో, స్వామికార్యముల నెరవేర్చుట చేతనే అర్చకుడుమానినలోపము తీరినది. వీరి సహాయము మరువతగినదికాదు.

ప్రతిష్ఠోత్సవమును దర్శింప నేతెంచిన వందలకొలది జనసమూహము ఆలయ చరిత్రలో జరిగిన పరివర్తనకు ఆశ్చర్యమంది పరమేశ్వరుని లీలలను కొనియాడిరి. బ్రాహ్మణాది సర్వవర్ణములవారికి భూరిసంతర్పణములతోడను, అర్చకాది పరిచారకులకు పెక్కు సంభావనలతోను, భేరీనినాదములు మిన్నుముట్ట బ్రాహ్మణాశీర్వాదములతో ది 25-2-21 తేదిన వృషభలగ్నమందు ప్రతిష్ఠాదికములు గావింపబడెను.

ఈ సమయమున గురుజాడ నరసింహంగారి భార్య మంగమ్మగారు విష్ణ్వాలయగర్భయములో వేయుటకు రు 40/ఖరీదుగల కంచుగంటను సమర్పించి గంటలేనికొరతనుతీర్చిరి.

సాంబయ్యసోదరులు పశ్చాత్తాపముకలిగి తిర్గి తమవృత్తిలో ప్రవేశింప కోరెదరేమోయని కొంతకాలము వేచి ఫల

ముగానక, సమీపవాసులగు ఆదిశైవ, వెల్నాటి అర్చకకుటుంబములకొరకు, యీమండలములో ఎచ్చటప్రయత్నించినను, స్కీముదావాలు అర్చక కుటుంబములను భయంకర రూపమున పీడించుచున్నవని, సాంబయ్యకు ఎదిరిగా రాజాలమనియు వినవచ్చెను. తిరిగి తిరిగి తుదకు గుంటూరుజిల్లా మందపాటినివాసులు ఆదిశైవులు నగు బ్రహ్మశ్రీ చదలవాడ పేరయ్యగారి కుమారుడు రామకోటయ్య అను యువకునిరావించి ది 21-4-21 తేదీన శ్రీరామేశ్వరున కర్చకునిగా నియోగించిన కార్యభారమును వహించిన రామచంద్రయ్యగారు పడిన కష్టము నేటివరకు నిర్విఘ్న ఫలోదయమగుటచే మరపునకు రాకయున్నది.

ది 20-2-21 మొదలు 20-4-11 వరకు మ. రా. శ్రీ. గురుజాడ సాళ్వాపతిరావుగారు శ్రీరామేశ్వరునకు నిత్యార్చనాదికములు భక్తిపూర్వకముగా నెరవేర్చి పూర్వుల ప్రతిష్టావనయందు తమకుగల అవ్యాజానురాగమును కార్యరూపమున చూపిరి. వీరిసేవ మరువదగినదికాదు.

ఇది యిట్లుండ విష్ణ్వార్చకులుకూడ, శివార్చకులుతీసిన దారినే "డబ్బుపుచ్చుకొని పనిచేయుట తమ మతధర్మములకు విరుద్ధమును, దూష్యమును అవుటచే మనఃపూర్వకముగా వదలుచున్నాము" అని రాజీనామావ్రాసి ది26-4-21 తేదిన దాఖల్ చేసిరి.

సుమారు సంవత్సరకాలము నెల 1 కి రు 30/ చొ॥ నౌకరిచేసి ప్రతిష్టాదులలో భూరిసంభావనల నందికొని తృప్తులై క్రొత్తశివార్చకుడు వచ్చి తమకండ్లయెదుట పనిచేయుటచూచి



యుండిరిగాన తాము మానినంతమాత్రమున పనులాగిపోవని తెలిసియు, యిట్టి అనాలోచితకార్యమొనర్చుటకు సిద్ధపడిన వీరినికూడ ఎన్నివిధములబోధించియు ప్రయోజనముగానక ది 9-5-21 తేదిన రిలీవు చేయవలసివచ్చెను.

క్రొత్తఅర్చకులు లభించువరకును, తప్తచక్రాంకితులైన శ్రీమాన్ ముక్తేవి గోపాలరావుగారు ది 20-12-21 తేదివరకు అర్చనాదికములు శ్రద్ధాభక్తులతోగావించి యెంతయో ఆదుకొనిరి. వీరిసాయముననే స్వామివారి నిత్యార్చనకు అంతరాయము గలుగలేదు.

కొంతప్రయత్నముమీద పెదమద్దాలి కాపురస్థులు పాంచరాత్రులు వేదాంతం వెంకట వీరరాఘవాచార్యులు గారు ఒక మాసంరోజులు అర్చనాదికములు చేసి దివి శ్రీరామాచార్యులుగారివల్లను, వారి బంధువర్గమువల్లను గల్గిన వత్తిడిచే వేళాయితులు కావలసినవారైరి.

తదుపరి రామచంద్రయ్యగారు గుంటూరుజిల్లా యనమదలవాసులును శ్రీవైష్ణవులును నగు శ్రీమాన్ అకలంకం రామానుజాచార్యులు గారి కుమారుడు వెంకటాచార్యులవారిని పిలువనంపి ది 20-12-21 తేదిన విష్ణ్వాలయ అర్చకస్థానమున నిలిపి కృతకృత్యులైరి.

ఇట్లు పాతఅర్చక కుటుంబముల వారు మానుకొనిన కొలది క్రొత్తకుటుంబములను తోడ్తెచ్చుటచే తీరినను అర్చక నివాసములకు స్థలములేని లోటు భర్తీచేయవలసిన నూతనభారమొకటి రామచంద్రయ్యగారి శిరమునబడెను.

ఈ స్థితిలో కోదండరాముడే ముందునడచి భక్తుడును విజయవాడ వాసియు కమ్మకులోద్భవుడును దానశీలుడును ఉత్తముడునగు చావరాల నరసయ్యగారి కుమారుడు వీరయ్యగారి హృదయముచొచ్చి, శివాలయపు తూర్పుసరిహద్దుగా నంటివున్నవారితాలూకు 596 చ. గ. నివేశనస్థలమును దానవిక్రయాధికారములు లేకుండ శ్రీరామేశ్వర కోదండరాములకు ఆచంద్రార్కము హక్కుగా సమర్పించుటకు ప్రేరేపించెను. రామచంద్రయ్యగారి ప్రార్థననంగీకరించి ది 22-5-22 తేదీన వీరయ్యగారు దానపత్రము వ్రాయించి వుయ్యూరు సబురిజస్ట్రారుఆఫీసున రున రిజస్టరుచేయించి స్వామివార్లకు సమర్పించి చరితార్థులైరి. వీరయ్యగారి ఏజంటుగారగు మ॥రా॥శ్రీ హేమాద్రి వెంకటప్పయ్యగారీ సందర్భమున చేసిన సహాయము శ్లాఘాపాత్రము. ఇంతటితో స్థలములేని లోటుతీరినది.

దానముగా లభించినగోతిని శీఘ్రకాలముననే పూడ్పించి అందు శివకేశవ అర్చకవాసముకొరకు రెండుభవనములు కట్టింపబడెను. ఇండ్లుతయారై ప్రవేశించువరకు అర్చకులకాపురమునకు రామచంద్రయ్య, భాస్కరరావుగార్ల గృహములే శరణ్యమయ్యెను.

ఇంతలో ట్రస్టి యడవల్లి శివరామ లక్ష్మీనరసింహంగారి గడువు మూడువర్షములు గడచినవి. వీరు సహజశాంతస్వభావులు, సదయహృదయులు, స్నేహపాత్రులునై వారి పరిపాలనకాలమున ఆలయముల ఉన్నతికై పాటుపడి గ్రామవాసుల మన్ననలకు పాత్రులైరి.



స్కీము నియమములప్రకారము తమ మూడుసంవత్సరములగడువు ముగియగానే యడవల్లి శివరామ లక్ష్మీనరసింహంగారు "గ్రామములోనివారు ట్రస్టిలుగానుండుట అవసరమనియు తమ ట్రస్టిషిప్పులోకూడా 1 వ వాదిగారగు రామచంద్రయ్యగారే సర్వవ్యవహారములను సమర్థతతో నెరవేర్చిరనియు వారినే ట్రస్టిగాఏర్పరచుట యుచిత"మనియు కోరి కోర్టువారికి రిపోర్టు చేసిరి. అంతట కోర్టువారు గ్రామవాసుల అభిప్రాయము కనుగొని శివాలయముట్రస్టిగా గురుజాడ రామచంద్రయ్యగారిని అప్పాయింటుచేసిరి.

దావాలు రెండుగా దాఖల్‌కాబడుటయు స్కీములలో ఒక్కొకట్రస్టిగా ఏర్పాటగుటకు నియమముండుటయు ఇరువురు ట్రస్టిలుండిన పోటీగా పనులుజరుపుచు ఒండొరులుసహాయులుగానుందురనియు దలచి అద్దానిని ఆచరణలోనికి తేదలచి గ్రామవాసులకోర్కె ననుసరించి కోదండరాముల ఆలయమునకు గురుజాడ భానుమూర్తిగారికుమారుడు వెంకటసుబ్బారావుగారిని కోర్టువారు ట్రస్టిగా అప్పాయింటుచేసిరి.

నూతనముగా అప్పాయింటుకాబడిన యిరువురు ట్రస్టిగార్లు ది 5-10-22 తేదీన లోగడట్రస్టిగారివద్ద దేవస్థానపుపూచిలను వప్పగింతచేసుకొనిరి.

గ్రామప్రజల కష్టసుఖముల పాలింపనేతెంచిన వుయ్యూరు జమీందార్ శ్రీరాజా వెంకటాద్రి అప్పారావుబహద్దర్ గారు పరివారసమేతముగా విడసి దేవళముల దర్శించి ఆనందభరితులైరి. ఆసందర్భమున ప్రజాతరపున శ్రీయుత కాటూరి వెంకటేశ్వర

రావుగారు రచించి సమర్పించిన వినతిపత్రమునందలి యీపద్యములు శ్రీ వారియెడల గ్రామస్థులకుగల కృతజ్ఞతను తెలుపగలవు.

సీ॥ నీదు పేరింటి మన్నీడు మున్నీయూర
నిర్మించె దేవతానిలయములను
కవిజీవితగ్రంథకరణ చణుండైన
శ్రీరామమూర్తి మాయూరివాడు
తెలుగుకన్నను గ్రొత్తతెరవున
నడిపించె మాయూరివాడప్పరాయసుకవి
రమణ సింహాద్ర్యప్పరాయని రాజ్యమ్ము
సవరించె గురుజాడ శరభరాజు

గీ॥ కలదు తొలినుండి మీదు పూర్వులకు మాకు
బాంధవమ్ము ప్రౌఢ మేరువునంటి నీవు
చూడవచ్చితి గావున చుట్టరికము
తెలిపికొని కల్పికొంద మగ్గలముగాగ॥

గీ॥ వెంకటాద్ర్యప్పరాయ పృథ్వీవిభుండు
తొల్లి తమకిచ్చినట్టి వృత్తులను మఱల
రామలింగేశ కోదండరామచంద్రు
లిపుడు నీమూలమున గడియించుకొనిరి
అచట నీపేరజరిగెడు నర్చనముల
గాంచి సేవించి త్వద్యశోగానములను
వీనుదోయికి విందుగా వినెడిభాగ్య
మబ్బునీనాడు నీకు విద్యాప్పరాయ



సిరియు సంపదకీర్తి విస్తరతయొసగి
తద్దయయె మన్నుగాత నిత్యమ్ము మిమ్ము
ఈవె కలకాలమీనేల యేలుమేలు
కలుగుగావుత మెపుడు తత్కరుణవలన.

ఆలయములకు మరల నుచ్ఛస్థితిలభించి శోభాయమానముగ దినదిన ప్రవర్ధమానములగుచుండ గ్రామవాసులలో ధార్మిక చింత ప్రబలమయ్యెను. పరమేశ్వర ప్రీత్యర్థముగా ఆముష్మిక ఫలప్రాప్తికై ఐహికఫలములను గోరక దానధర్మములొనర్చుట హైందవసంతతికి సాంప్రదాయము.

గ్రామదేవతార్చనలగు ఆలయములను ఎవరికివారే తమ స్వంత దేవతార్చనగా అభిమానించి భక్తిశ్రద్ధలతో ఫలాపేక్షను గోరక పూజించుటచేత కైవల్యప్రాప్తియగును. ఇట్లు ధార్మిక భక్తివరులు గ్రామమున కలంకారప్రాయులు. ఈనాడిట్టివారు బయల్పడుట శుభప్రదము. ప్రజాసామాన్యమునకు వీరే మార్గదర్శకులగుదురు.

కాపు కులోద్భవుడు విష్ణుభక్తుడునగు పోలాశి శ్రీరాములుగారి జ్యేష్ఠపుత్రుడు కోటయ్యగారు శివకేశవులయందభేద భావమువహించి 100 తులముల ఎత్తుగల రజతశ్రీపాదముల రెంటిని చేయించి శ్రీ రామేశ్వర కోదండరాముల పాదారవిందములకు సమర్పించి చరితార్థుడయ్యెను.

విష్ణ్వాలయముతోపాటు పూర్వులచేప్రతిష్ఠితమై శిథిలావస్థలోనున్న ప్రపత్తాంజనేయ దద్ధళము నూడదీయించి నూతనాలయమును ట్రస్టి ఆఫీసువారే కట్టించుటకు తలపెట్టిరి.

గ్రామవాసియు కాపుకులసంభవుడు, విష్ణుభక్తుడునగు పోలాశి శ్రీరాములుగారి ద్వితీయకుమారుడు క్రిష్టయ్యగారు ముంమునకువచ్చి నూతనముగా కట్టనున్న ఆంజనేయాలయము తన స్వంతద్రవ్యముతో కట్టించి స్వామివార్లకు సంపూర్ణహక్కులతో సమర్పింపదలచితిననియు, తనికీఆలయమున ప్రత్యేకహక్కులేమియు నక్కరలేదనియు తాను కట్టించుటకు సమ్మతినికోరి పవిత్రోద్దేశ్యముతో ట్రస్టిగారికి అర్జిదాఖల్‌చేయగా పరమానందమున వారందుల కనుమతించిరి. క్రిష్ణయ్యగారు తమవాగ్దానమును సుమారు రు 1000 లు ఖర్చుతో అనతికాలములోపలనె పరిసమాప్తిచేసి కోదండరామునిచరణసన్నిధిని సమర్పణమొనర్చి సంతుష్టహృదయుడయ్యెను.

గురజాడగ్రామమున కాదిమవాసులలో నొకరగు నర్రా లక్ష్మయ్యగారి ద్వితీయపుత్రుడంకినీడుగారును వీరి జ్యేష్టసోదరుడు శోబ్బయ్యగారి కుమారుడు వెంకటకృష్ణయ్యగారును సద్గుణసంపన్నులు ,శివభక్తిపరులుగాన శ్రీరామేశ్వరునకు హక్కుగా జరుగగలందులకు దానవిక్రయాధికారములు లేకుండా స్వామివారి వుపయోగమునకు గాను 564 చ. గ. నివేశనస్థలమును ది 5-1-1925 తేదిన దానపత్రము వ్రాసి వుయ్యూరు సబ్ రిజిస్ట్రారు ఆఫీసు నె ర్ను రిజస్టరుచేసి సమర్పించిరి.

గురజాడ శరభరాజుగారి భార్య లక్ష్మాయమ్మగారు రామభజన మందిర నిర్మాణముకొరకు రు 50/ రొక్కముగా సమర్పించిరి. ఈమె కోర్కెప్రకారం విష్ణ్వాలయ ప్రాకారములో దక్షిణమున యీమందిరము కట్టించబడినది.



చల్లా శేషాచలంగారి భార్య అచ్చమ్మగారు శివాలయ ముఖమంటపములో గంటనిమిత్తమును తీర్థపుబిందెకుగాను రు 50/ లు సమర్పించిరి. ఈమెగారి కోర్కెప్రకారం ఏర్పాట్లు చేయబడినవి.

ఇట్లు గ్రామములోని ఆస్తికమహాజనులెల్లరు ఈయుద్యమమునందలి సచ్చింతనమును సత్ఫలములను గురుతించి స్వామికార్యములయందు బద్ధాదరులై తమతమ శక్తికొలది సేవించుకొనుచు ప్రథమమునుండియు నీవిషయమున కడగండ్లపాలైన వారిని క్రమముగా కష్టముల మఱవజేయుచుండిరి.

క్రమముగా దేవాలయముల శిథిలితావస్థ మారిపోయి కలకలలాడు నవ్యతేజము ప్రాప్తించి కనులపండువుగా నలరారుచున్నవి. ధ్వజశిఖరాది ప్రతిష్టలైన పిమ్మట క్రమముగా యజ్ఞశాలా,పాకశాలా,గల్లాకొట్లు మొదలగువాని నిర్మాణము జరిగినది. ఈసత్పరిణామములను కనులారగాంచినవారలు పూర్వపు శిథిలితావస్థతలంచుకొని ఇంతపని జరుగుటకు సొమ్మెచటనుండి వచ్చుచున్నదనియు, పూర్వమీద్రవ్యమెల్ల నేమయ్యెడిదనియు నక్కజమందుచుందురు.

దేవస్థానముల వుపయోగముకొరకు ప్రాకారముల సరిహద్దున చెరిసగముగా నుండులాగున ఒకరాతినుయ్యి కట్టించబడినది.

తలవని తలంపుగా 16-5-1925 సం॥ తేదిని ఎన్నియో కుటుంబములకు తలదాచుకొనుటకు తావు లేకుండజేసి లక్షలకొలది నోరులేనిజీవరాసులను తన పొట్టనుబెట్టుకొని బీజారోపణకెదురు చూచుచున్న వసుంధరాదేవి చల్లనికడుపున చవుడు

రకజేసి, శ్రీమంతులనుకొనువారి కండ్లనుగూడ యించుక తెరచిన ప్రచండ ప్రభంజనుని భీభత్స ప్రదర్శనమునకు ఆలయప్రాకారము లుగూడ గురియయ్యెను. జగత్ప్రాణుడు సమవర్తియైనపుడు మా దేవస్వమునుగూడ మన్నించకపోవుట వింతకాదని సరి పెట్టుకొని మరల నెల్లెల్లో వెనువెంటనే ప్రాకారము శక్తి కొలది నిర్మించబడెను. పిమ్మట రెండుఆలయములకు ముఖమంట పములుకూడ నిర్మింపబడినవి.

శ్రీరామేశ్వర కోదండరామాలయముల రెంటికిని పూర్తి గా సున్నపుపని చేయించబడినది. అలంకారపరికరములును వుత్స విగ్రహములును కొలదివాహనములునుకూడ ఏర్పడినవి. నందీశ్వర ఆంజనేయప్రతిష్ట లీ సంవత్సరమాఘమాసమున 2-2-28 తేదీన జరుగనున్నవి.

కాని యీదావాలలో ట్రస్టిప్రతివాదులలో నొకరయ్యు ప్రధమమునుండియు దురభిమానమును విసర్జించి స్వామికార్య మునకు అనుకూలురై శక్తికొలది చేయూతయొసగుచు అవసర మైనపుడెల్ల అనుభవముతోగూడిన తమసదుపదేశములనిచ్చుచు ఈ పునరుద్ధరణకార్యమున కెంతయో సహాయముచేయుచు వచ్చినశాంతగుణులు, ఆస్తికులు నగు గురుజాడ కామేశ్వరరావు పంతులుగారు ఈకార్యములెల్ల పూర్తియగుటచూచి సంతసించు భాగ్యములేమి ఈమధ్యకాలమున లోకాంతరగతులై స్వామి కార్యతత్పరులకు నెంతయు నిరుత్సాహమును విషాదమును గలి గించిరి. శ్రీకోదండరామ, రామలింగేశ్వరులు ఆత్మభక్తుడగు నీ సత్పురుషునియాత్మకు శాంతినొసగుదురుగాత. వీరిఏకపుత్రుడగు



సాశ్వావతిశర్మగారు జనకుని వాగ్దానము ప్రకారం ఆలయములముఖ మంటపముల రెంటికి సరిపోవు తారసురాయి సుమారు రు 200 ల కిమ్మతుగలవి స్వామివార్లకు సమర్పించి పితృవాక్యపరిపాలన మొనర్చిరి.

గురుజాడగ్రామసర్వే 84 నెంబరులోని తాళ్ళఅనుభవము ను శ్రీ వుయ్యూరు రాజాగారు, దేవస్థానమునకు సంక్రమింపచేసిరి.

ఈ సందర్భములో చాగంటిపాటి శోభనాద్రి జరిగిం చిన క్రిమినల్ చర్యలు స్వామివారికి అనుకూలముగా తేలినవి. హక్కునిర్ధారణకు శివిల్‌కోర్టులో తిర్గిదావా దాఖల్ కాబడినది.

మ॥ రా॥ శ్రీ॥ చాపరాలవీరయ్యగారు సమర్పించిన దాన వత్రం తాలూకు నివేశ్నస్థలం గురుజాడ లక్ష్మమ్మగారిదని వార సత్వరీత్యా తమకు రావలసి వున్నదని గురుజాడ ఆదినారాయణం గారు వారసత్వపు దావాలో చేర్చిరి.

ఈరెండుదావాలును శివిల్ కోర్టులలో నిలవలోనుండి వున్నవి. ట్రస్టిరీత్యా, గురుజాడ రామచంద్రయ్యగారీ దావాలలో మిగుల మెలకువతో వ్యవహరించుచున్నారు. జయాపజయము లను గురించి శ్రీరామలింగేశ్వర కోదండరాములె తగు జాగ్ర త్త తీసుకొందురు.

ట్రస్టిల సముచిత సమాలోచనమువలనను కార్యదీక్షత వలనను ప్రజారాధనతత్పరత్వమువలనను స్వామికార్యములు నానాటికి జయప్రదములును శుభపర్యవసితములు నగుచున్నవి.

స్కీముదావాల ట్రస్టిప్రతివాదులలో నొకరగు గురు జాడ సీతారామయ్యగారు ఆస్తికులగుటచే అభివృద్ధికార్యములను

కండ్లారగాంచి సంతసించిరి. వీ రిటీవలనే ఆకస్మికమరణమునంది దివి కేగిరి. వీరియాత్మకు పరాత్పరుడు శాంతిచేకూర్చుగాత.

ఈ ఆలయ చరిత్రమునకు ప్రథమమునుండి నేటివరకు సంబంధముగల దగుటచే గురుజాడ వారివంశమునుగూర్చి యిందు నించుక విస్తరించిచేసిన ప్రశంస ఆస్తికమహాజనుల కాదరణీయ మగునని తలంచెదను. ఆలయములసుస్థితికి, నిత్యవ్యవహారమునకు అవసరమగు పనులన్నియు నిప్పటికి పూర్తియైనవి. ఇంకను అవకాశమునుబట్టి చేయవలసిన పనులెన్నియైనగలవు. ఆలయముల కనుబంధములుగ నొక వేదపాఠశాలయు, నొక పఠనమందిరము నిర్మింపవలయునను తలంపులుగలవు. కళ్యాణమంటపగోపురాదుల నిర్మాణముకావలెను. గ్రామస్థులకు నేటివరకును స్వామికార్యమునెడలగల శ్రద్ధాభక్తులును అభిముఖ్యమును ఎన్నికార్యముల నైన చేయింపగలవనువిశ్వాసము పూర్ణముగానున్నది. పురిటిగండములును బాలగ్రహములబాధలును గడచి తేరుకొనిన యాలయముల కిక నెట్టికొరతయు వాటిల్లకుండ గ్రామవాసుల ఆస్తిక్యబుద్ధియే రక్షించుకొనగలదు. భిన్నభిన్నమార్గముల ఆలయపునరుద్ధరణ సందర్భమున స్వామికార్యమునకు తమబుద్ధికి తోచినట్లు తమశక్తికొలది తోడ్పడిన మహాజనులనెల్లర నాసర్వేశ్వరుడు కామితార్థదుడై రక్షించుకొనుగాత.

గురుజాడ, } విధేయుడు,
ది 5-1-28. } గురుజాడ భాస్కరరావు.

—

